ఎవరెస్టు ప్రచురణ
ప్రథమ ముద్రణ
అక్టోబర్ – 55

లక్ష్మీ ప్రెస్,
రాజమండ్రి.



**0–8–0**



సంపాదకవర్గం:

బండా రామారావు

సి. హెచ్. సత్యనారాయణరావు

దివ్వెల పుల్లేశ్వర్రావు

పి. రామరాజ్

పి. వి. రత్నం

# ముందుమాట

"మానవలోకం... మనిషిని కుక్క నమ్ముతోంది.

మనిషిని మనిషి నమ్మలేకపోతున్నాడు."

అందుకే, ఇది చదవండి. చదివించండి.

— సంపాదకవర్గం.



# మానవి

---

ఒక పల్లెటూరి సామాన్య కుటుంబాన్ని. ఆధారంగా చేసుకొని, యౌవ్వనపు పొంగులో, ఒక యువకుని నిలకడలేని నడతకు, ఒక అమాయక జీవితం ఎలా నాశనమైందో, ఈ నవలలో చిత్రించడం జరిగింది.

అంతేకాదు. బాధపడే మిత్రునిలో, ఉత్సాహం రేకెత్తించుదామని, ఒక నిష్కల్మషజీవి ఆడిన మాటలను అపార్థం చేసుకొని, అనుమానపు పెనుభూతం సందిట్లో నలిగిపోయి, చేసే నిర్ణయాలు; 'అగ్నిపర్వతం'లాంటి రహస్యాన్ని విశాలమైన మాతృహృదయంలో దాచుకున్న మాతృప్రేమ, ఇంకా నేటి సంఘంలో, కరుడుగట్టిన

పెద్దల సాహచర్యాలలో కదతే. కల్పనాకాంక్ష – దాని పరిణామాలూ యిందులో చూడొచ్చు.

ఒకనాడు నేను, మిత్రులు రత్నంగారి సాహిత్యగోష్ఠి జరిపే సందర్భంలో, ఆయన "బావ" అన్న నవల చదివి వినిపించాక, ఉత్సాహం పట్టలేక 'ఏమండీ! నన్నుకూడా ఓ నవల రాయమంటారా' అన్నాను. 'ఓ! తప్పకుండా వ్రాయండి' అన్నారు. అంతే. ఆరోజునే – ఎనిమిది గంటల్లో – చిత్రించిన ఈ నవలను పట్టుకెళ్ళి, చదివి, వినిపించాను.

అప్పుడు ఆయన యిచ్చిన అభిప్రాయం; యిప్పుడు యిచ్చిన ప్రోత్సాహం ఈ నవల ప్రచురణకు 'పునాదులు'.

సహకార, సుహృద్భావాలను

నా సహచరులకు, స్నేహితులకు నా నమస్సులు.

ఈ నవల గురించి శ్రమనుకోక, పలువురు ప్రముఖులు అభిప్రాయాలు పంపినందులకు కృతజ్ఞుణ్ణి.

ఈ నవలను ప్రథమంగా ప్రచురించిన "ఎవరెస్ట్ పబ్లికేషన్స్" వారికి నా ధన్యవాదాలు.

తొలిసారిగా, నవలను మీ ముందు పెడుతున్నాను. తెరిచి, తరిచి మీ మీ అభిప్రాయాలను— నిర్మొహమాటంగా — అందిస్తూ ఆశీర్వదించమని అభ్యర్థిస్తున్నాను.

మాధవరాయుడుపాలెం. }
2—10—55 }

ఇట్లు,
సత్యనారాయణరావు.

**అంకితం:**

నన్ను కని, పెంచి, పెద్దవాణ్ణి చేస్తున్న

**అమ్మకూ, నాన్నకూ.**

# అగ్నిపర్వతం

సంధ్యా సమయం —

సుశీల మల్లెపందిరి ఎక్కి, పువ్వులు కోస్తోంది. ఆ సమయంలో వీచే చల్లనిగాలి, సుశీలకు చక్కిలిగింతలు పెట్టినట్లనిపించింది. ముసుమ్ము రేపుకుంటూ, వచ్చే పోయే మాటలను, వయ్యారంగా చూస్తూండగా, వళ్ళోని పువ్వులు ఝల్లున రాలిపోయాయి. పువ్వులను ఏరుకొని, వడి నింపుకొని, ఇంట్లోకి వెళ్ళింది.

అంతలో "ఏమండీ పిల్ల పెళ్ళిసంగతసలు తలపెట్టరేమిటండీ?" అంది రత్తమ్మ.

పూజకు తయారౌతున్న సుబ్బన్న "ఎప్పుడూ దాని పెళ్లి గొడవేమిటే? దాని బరువేం పోసుకున్నావు?" అన్నాడు

"అదికాదండి. మీరు పూజలలో కూర్చుంటే, దేముడొచ్చి చేస్తాడుటండీ పెళ్ళి. అది నాకెంత బరువో, మీకూ అంతే బరువు."

"అసలు నీ ఉద్దేశ్యమేమిటి? ఏమి చేయమని?"

"అబ్బే! సూర్యంకూడా వచ్చాడా. కనుక్కుని, వాళ్ల నాన్నగారిని ఒప్పించి, అయ్యిందనిపిస్తే బరువు తగ్గదూ అంటా!"

"వాడెక్కడికి పోతాడులే. ఎప్పటికేనా వాళ్ళిద్దరూ ఒకింటివాళ్ళిలాగా అవుతారు. మధ్య నీకెందుకే కంగారు. సరే, వెళ్ళు. అమ్మాయిని పిలు. పూజ కాలస్యమౌతోంది. పువ్వులు తెమ్మను." అన్న నాన్నమాటలు ఆమె సిగ్గును తప్పు చేసి, పూజామందిరం దగ్గరకు నడిపించాయి. నాన్న ముందు పువ్వులుపెట్టి, వంచినతల ఎత్తకుండా తనగదిలోకి తుర్రుమంది.

అద్దంలో చూసుకుంది. చిన్నగా నవ్వింది. క్రింది పెదవి కొరుకుతూ, ఓరగంటతో చూసింది. తన అందాన్ని చూసి తనే మురిసిపోయింది. అంతలోనే సూర్యం ఫోటో దగ్గరకు పరుగెత్తింది.

జడకుచ్చుతో ఆ ఫోటోమీద కొడుతూ, ఆ బావ నవ్వునుచూసి సిగ్గుపడింది. ఒక్కసారి నెమ్మదిగా, 'బావా!' అంటూ ఆఫోటోని హృదయానికి హత్తుకుంది. ఎవరేనా చూస్తారేమో నని, అటూ ఇటూ చూసి, ఆ ఫోటోని ఒక్క ముద్దుపెట్టుకొని, భారం అంతా తగ్గేలా, ఒక్క నిట్టూర్పు విడిచింది.

ఇంతలో బూట్లు చప్పుడు వినబడింది. ఉలిక్కిపడి, ఫోటోను ఎక్కడ పెట్టాలా అని, తడుముకుంటూ అద్దం దగ్గర పెట్టేసి, బొట్టుపెట్టుకుంటున్నట్టు నటిస్తూ, గుమ్మం వైపు ఓరకంటితో చూస్తూ నిలబడింది.

సూర్యం మెల్లగా గదిలోకి చొరబడుతూ, "అమ్మేది సుశీలా?" అన్నాడు.

"వంటింట్లో వుంది."

"తమరిక్కడున్నారేం?"

"ఊరికేనే. తల దువ్వుకుంటున్నాను."

"ఈ మంత్రం తలదువ్వుకోడం ఏమిటే అంటాను. ఏ నా కళ్ళ సినీమాకేనా లేదుకదా. అసలు సంగతేదో వుంది. చెప్పవూ?"

"ఏముందీ? ఏమీలేదు. ఊరికేనే. అదికాకపోయినా, తల దువ్వుకోవటం సినీమాకి వెడితేనేనేమిటి? ఇంట్లో మాత్రం శుభ్రంగా వుండకూడదా?"

"ఉండొచ్చు. కాని ఆ సింగారించుకోవటం, నా ఫోటో ముందే ఎందుకు చేస్తున్నావా అంటున్నాను." అన్న సూర్యం మాటలు, సుశీలను ఎక్కడలేని సిగ్గులోను ముంచెత్తేశాయి. అక్కడినుంచి మెరుపుతీగెలా వంటింట్లోకి పరుగెత్తింది.

"ఏమే అంత గబగబా పరుగెత్తుకొచ్చావు?" అన్న అమ్మ మాటలు, ఏ సమాధానం చెప్పనీయకుండా, మరింత సిగ్గుతో ఆమెను ఉబ్బితబ్బిబ్బు చేసేశాయి. మళ్ళీ మల్లెపందిర దగ్గరకు పరుగెత్తింది. 'బావ గదిలో కొచ్చినట్లు అమ్మ కెలా తెలిసింది?" అన్న ఆమె అనుమానం, ఆలోచన, కలవర పెట్టింది.

"చిన్నప్పుడు కోపమొస్తే, బావ జడపట్టుకు లాగి, బుగ్గ గిల్లేవాడు. బావకంటె ముందు నేనే పరుగెత్తేదాన్ని. ఇప్పుడో!

అమ్మో! బావంటే నే......" అని అలా ఏవేవో, చిన్నప్పటి విషయాలను స్మరించుకుంటూ, మల్లెపందిర చాటును ఆనుకొని, చందమామ కేసి చూసింది. చిలిపిగా నవ్వింది.

ఇంతలో "అమ్మాయి! బావకు కాళ్ళు కడుక్కోడానికు నీళ్ళిచ్చిరా" అన్న మాటలు ఆమె సిగ్గును మందలించి, అమ్మ దగ్గరకు తీసుకొచ్చాయి.

"నేను వెళ్ళనే."

"ఫర్వాలేదులే! బావేగా."

"ఏమో బాబు. నాకు సిగ్గు."

"ఇప్పుడే యింత సిగ్గు అయితే..." అని అంటూ, నీళ్ళిచ్చింది రత్తమ్మ.

వంచిన తల యెత్తకుండా, సూర్యం భోజనం చేస్తున్నాడు. అమ్మనో కంటకనిపెడుతూ, సుశీల తలుపుచాటునుంచి, సూర్యాన్ని ఓరగా చూస్తూ వుంది. భోజనం చేసి సూర్యం తన గదిలో కెళ్ళాడు. 'చలం' నవల చదువుతూ, ఏవేవో ఆలోచిస్తూ, దీపాన్ని తగ్గించి, పక్కమీద వాలాడు.

## 2

తెల్లవారింది —

సూర్యం లేచి, స్నానంచేసి, బట్టలు మార్చుకొని, అద్దం దగ్గర నిలబడి తలదువ్వుకుంటున్నాడు. ఇంతలో సుశీల,

కాఫీగ్లాసుతో సూర్యం దగ్గర నిలబడింది. సూర్యానికి సుశీల అద్దంలో కనిపించింది. కాని 'ఎలా పిలుస్తుందో', ఏమిచేస్తుందో' అని, చూడనట్టు నటిస్తూ, వంకీలు దిద్దుకుంటూ, ఈలపాటను ప్రారంభించాడు.

సుశీలకు తళుక్కుమని మెరుపులా ఒక ఊహ మెరసింది. అంతలోనే సిగ్గుపడింది. కాని తెగించి "ఇంత పొద్దున్నే యీ సూటు వేసుకోవలసిన అవసరం ఏమిటో ?" అని కాఫీ గ్లాసు టేబులుమీద పెట్టి వెళ్ళిపోబోయింది.

"తమరు కాస్తాగుతారా ?"

గుఱ్ఱాన్ని కళ్ళెంతో లాగినట్టు నిలబడిపోయింది.

"ఇంత ప్రొద్దున్నే బట్టలు వేసుకోకూడదా ?"

"వేసుకోవచ్చు. యీ పల్లెటూర్లో ఎందుకూ అని."

"పల్లెటూర్లో బట్టలు కట్టుకో కూడదా ?"

"కట్టుకుంటే మిమ్మల్ని చూసేవారెవరున్నారు ?"

"నువ్వున్నావుగా !" అని సూర్యం కాఫీగ్లాసు అందుకున్నాడు.

సుశీల లేడిలా ఒక్కగంతులో పారిపోయింది. అత్తమ్మ వచ్చి "ఏం నాయనా ! కాఫీ త్రాగేవా !" అంది.

"తాగేనత్తయ్యా !"

"ఎక్కడికి బయలుదేరుతున్నావు ?"

"చంద్రం యింటికి వెళదామని."

"చంద్రాన్ని నువ్వెట్లా ఎరుగుదువు?"

"అతనూ నేనూ ఒక రూములోనే వుంటున్నాం! ఒకే క్లాసుకూడాను."

"ఓ! అలాగా? చంద్రం బి.ఏ. అన్నమాట."

"ఔనత్తయ్యా!"

"ఎప్పుడూ చెప్పేడే కాదు. అయినా యీవైపు కెప్పుడూ రాడు. ఇంట్లో ఎప్పుడూ చదువుతూ వుంటాడట. సరే వెళ్ళి త్వరగా రా నాయనా! భోజనానికి ఆలశ్యం చేయకు" అని గుమ్మం వరకు మేనల్లుడిని సాగనంపి వంటింట్లో పడింది రత్తమ్మ.

"అమ్మాయ్! సూర్యం వచ్చాక యివతలకి రావటమే మానేశావేమిటే. అప్పుడే నీ మొగుడైపోయినట్లు, ఏమిటా సిగ్గు? బావకీ కూర తరుగు."

"హో అమ్మా! నే తరగను."

"సరిపోయింది. కూరేనా తరగవుటే. అన్నీ నేనే చేసుకోవాలా? రేపు పెళ్ళయ్యాక బస్తీలో కాపురం పెడితే ఏం చేస్తావు?" అని రత్తమ్మ అనగానే, సుశీల నవ్వుతూ కత్తిపీట వేసుకొని కూర తరగటం ప్రారంభించింది.

సుబ్బయ్య వచ్చి "ఏమిటే యిప్పటినుంచీ దాన్ని చాకిరీతో చంపేస్తున్నావ్? కూర నీవు తరుక్కోలేవు? రేపొద్దున్న పెళ్ళయాక ఎలాగూ తప్పదు!" అని నవ్వుతూ వెళ్ళి

పోయాడు. ఏడుస్తూ "నాన్నా! పట్టకి! వెళ్ళకూడ్రా. నేను చేసుకుంటానే." అని తను కన్నీటిని తుడుచుకుంది.

సుశీల ముడిచిపోయినా తన గదిలోకెళ్ళి, లేసులు కుట్టు కోవడం మొదలెట్టింది. కాని ఏకాగ్రతను చెయ్యని ఆలోచనలు తొలిచి వేశాయి. "బావను చూడాలనుకుంటాను... తొందరగా వెళ్ళాలని వుంటుంది. కాని..." అని ఏవేవో అనుకుంటూ ఉండగా లేసు సూది గుచ్చుకోగానే ఉలిక్కిపడింది.

# 3

సూర్యాన్ని చూసి "రారా!" అని చంద్రం కుర్చీ చూపించాడు.

"ఎప్పుడూ పుస్తకాలేనేమిట్రా? అక్కడా యిదే పని, యిక్కడా యిదే పని" అన్నాడు సూర్యం, కుర్చీలో కూర్చుని సిగరెట్టు ముట్టిస్తూ.

"ఔను లే! నీకు పుస్తకాలెందుకు? సుశీల వుండగా..." అన్నాడు నవ్వుతూ.

"నీ మొఖం! బావని, నాతోనే మాట్లాడదు! రేపొద్దున్న పెళ్ళైతే, నీలాంటి ఫ్రెండు ఎవడేనా వస్తే, ఆ సమయానికి నేనింటిదగ్గర లేకపోతే, వాడి గతేంకావాలి?"

"కర్మంజాలక, అతన్ని కూర్చోమని, మర్యాదచేసి ఎదురుగా తను కూర్చుని, బాతాఖానీ వేస్తూంటే, అదే సమయానికి, తమరువస్తే, ఏమైపోతారో! అప్పుడు?"

"చంద్రాన్ని నువ్వెల్లా ఎరుగుదువు?"

"అతనూ నేనూ ఒకహాములోనే వుంటున్నాం! ఒకే క్లాసుకూడాను."

"ఓ! అలాగా? చంద్రం బి.ఎ. అన్నమాట."

"ఔనత్తయ్యా!"

"ఎప్పుడూ చెప్పేడే కాదు. అయినా యీవైపు కెప్పుడూ రాడు. ఇంట్లో ఎప్పుడూ చదువుతూ వుంటాడట. సరే వెళ్ళి త్వరగా రా నాయనా! భోజనానికి ఆలశ్యం చేయకు" అని గుమ్మం వరకు మేనల్లుణ్ణి సాగనంపి వంటింట్లో పడింది రత్తమ్మ.

"అమ్మాయ్! సూర్యం వచ్చాక యివతలకి రావటమే మానేశావేమిటే. అప్పుడే నీ మొగుడైపోయినట్టు, ఏమిటా సిగ్గు? బావకి కూర తరుగు."

"పో అమ్మా! నే తరగను."

"సరిపోయింది. కూరేనా తరగవుటే. అన్నీ నేనే చేసుకోవాలా? రేపు పెళ్ళయ్యాక బస్తీలో కాపురం పెడితే ఏం చేస్తావు?" అని రత్తమ్మ అనగానే, సుశీల నవ్వుతూ కత్తిపీట వేసుకొని కూర తరగటం ప్రారంభించింది.

సుబ్బయ్య వచ్చి "ఏమిటే యిప్పటినుంచీ దాన్ని చాకిరీతో చంపేస్తున్నావ్? కూర నీవు తరుక్కోలేవు? రేపొప్పున్న పెళ్ళయినా ఎలాగూ తప్పదు!" అని నవ్వుతూ వెళ్ళి

పోయాడు. రత్నమ్మ "గారాలపట్టివి! వెళ్ళమ్మా. నేను చేసుకుంటాలే." అని తను కత్తిపీట తీసుకుంది.

సుశీల ముడిచిపోతూ తన గదిలోకెళ్ళి, లేసులు కుట్టుకోవడం మొదలెట్టింది. కాని ఆ ఏకాగ్రతను తీయని ఆలోచనలు త్రోసి వేశాయి. "బావను చూడాలనుకుంటాను... దగ్గరగా వెళ్ళాలని వుంటుంది. కాని..." అని ఏవేవో అనుకుంటూ ఉండగా లేసు సూది గుచ్చుకొనగానే ఉలిక్కిపడింది.

# 3

సూర్యాన్ని చూసి "రారా!" అని చంద్రం కుర్చీ చూపించాడు.

"ఎప్పుడూ పుస్తకాలేనేమిట్రా? అక్కడా యిదే పని, యిక్కడా యిదే పని" అన్నాడు సూర్యం, కుర్చీలో కూర్చొని సిగరెట్టు ముట్టిస్తూ.

"ఔనులే! నీకు పుస్తకాలెందుకు? సుశీల వుండగా..." అన్నాడు నవ్వుతూ.

"నీ మొఖం! బావని, నాతోనే మాట్లాడదు! రేప్రొద్దున్న పెళ్ళాడితే, నీలాంటి ఫ్రెండు ఎవడేనా వస్తే, ఆ సమయానికి నేనింటిదగ్గర లేకపోతే, వాడి గతేంకావాలి?"

"కర్మంజాలక, అతన్ని కూర్చోమని, మర్యాదచేసి ఎదురుగా తను కూర్చుని, బాతాఖానీ వేస్తూంటే, అదే సమయానికి, తమరువస్తే, ఏమైపోతారో అప్పుడు?"

"ఏమిటా అవసరం. మంచిపని చేసుకుంటావా!"

"మాటవరసకే అని. ఓరా సుశీల అలాచేస్తే , పెళ్ళోకి తీసుకువెళ్ళి, చివాట్లు వేసాడిస్తావు."

"నేనలా చెయ్యనుగా."

"అనటానికేమిలే! నువ్వేకాదు: చాలామంది అంతే. అది సహజంకూడా. సంఘం మనకు శాసనాలతో అలవర్చిం దదే."

"సరేగాని, ఆవు! అలా పోదాం. లే." అని చంద్రాన్ని బలవంతంమీద యింటికి తీసుకువచ్చి , తన గదిలో కూర్చో బెట్టాడు.

సిగరెట్టు ముట్టించి, అటూ యిటూ చూసి —

"సుశీలా!" అని పిలిచాడు. లోపలినుంచి వచ్చి 'ఎందుకూ?' అన్నట్టు సుశీల తొంగి చూసింది.

"కొంచం కాఫీ తీసుకురా!" అన్నాడు సూర్యం.

తల్లితో చెప్పి, ప్రక్కగదిలోవున్న యిద్దరూ ఏమిచెప్పు కుంటారో అని వినడంకోసం, చెవులు నిక్కించి కూర్చుంది.

కొంతసేపటికి రత్తమ్మ కాఫీ యిచ్చి, చంద్రాన్ని పలుకరించి, లోనికి వెళ్ళిపోయింది.

"చూసావురా! సుశీలకు చెపితే వాళ్ళమ్మ యిచ్చింది కాఫీ. బహుశా వెళ్ళవలసివుంటుంది. అంచేతే. నాకు యిల్లాంటి బైటులంటే చిరాకు. ఇదే మా శారదాంబో, కామేశ్వరో

అయితే, కత్తిలా, కాఫీ పట్టుకువచ్చి, నిన్నుకూడా పలకరించి మరీ వెళ్ళేవారు." అని సూర్యం అన్నమాటలు చంద్రాన్ని కోరుకోనివ్వలేదు.

"నువ్వు తళుకుబెళుకులకు మోసపోతావురా! నాగరికతఎంతరా? నాలుగు రోజుల్లో నేర్పొచ్చు." అన్న చంద్రం మాటలు సుశీల మనస్సును మంచులో ముంచాయి.

"ఎంత తెలివితేటలున్నాయో! బావ అదోరకం మనిషి! దానుకు తిరగాలంటాడు. సిగ్గులేకపోతేసరి. అయినా అదేమిటి? 'బైతు'నైతే అలాక్కాదు, యిలావుండాలని నాతో చెప్పాలి కాని, అతనితో చెప్పటం దేనికి?" అని అనుకుంటూవుండగా చంద్రం "యిక నే వెళ్ళివస్తానురా! పనుంది." అని లేవబోయాడు.

"వుండవోయి! వెళ్ళొచ్చులే! కానీ నీ ఉపన్యాసం! అసలు, ఆడదాన్నేమన్నా అంటే, మండిపడిపోతావేమిట్రా? తస్సాదియ్యా! నువ్వాడదానివై పుడితే, మేమంతా ఊరొదలి పారిపోవలసిందే." అని యింకా ఏదో అనబోతూవుండగా, సుశీల ఎదురుగా వచ్చి "బావా! చంద్రాన్ని, నిన్ను అమ్మ భోజనానికి రమ్మంటోంది" అని వెళ్ళిపోయింది.

సూర్యం, చంద్రంవైపు 'యిలా నిర్భయంగా మాట్లాడేసిందేమిటి?' అన్నట్టు చూశాడు.

'మరేమిటనుకున్నావ్?' అన్నట్టు చంద్రం సమాధానంగా చూశాడు.

* * *

తృప్తిగా భోజనం చేస్తున్నాడు. సుశీల నెయ్యి వడ్డించింది "చంద్రంతో తాను చెప్పిందంతా. కంఠంలో యిక్కిపోయింది ఇంత ధైర్యం ఎలా వచ్చింది? 'చంద్రం ఎప్పుడూ యిటువైపు రాడు' అంది అత్తయ్య. కాని, సుశీల పెద్ద పెరుగున్నట్లు పలకరించి. పనికి వడ్డిస్తాం దేమిటి? ఆడవాళ్ళని నమ్మకూడదు ఎక్కడలేని సిగ్గూ, అభినయిస్తారు. అవసరమొస్తే యిట్టే మార్చేస్తారు." అని సూర్యం అనుకుంటుండగానే, భోజనం ముగించారు.

గదిలోకి వెళ్ళి, సిగరెట్టు ముట్టించి ఆకబుసు, యీకబుసు చెప్పుకున్న తరువాత, యింటికి వెళ్ళిపోతానన్నాడు చంద్రం.

"సరే, పెళ్ళుదువుగానికావి, యిక్కడేమీ ఊసిపోవటం లేదూ. ఎల్లుండి వెళ్ళిపోదాం."

"వెళ్ళొచ్చు లేవోయ్. తర్వాత వస్తా" అని వెళ్ళిపోయాడు చంద్రం.

సూర్యం కాస్సేపుకూర్చొని, పత్రిక చదివాడు. సాయం కాలం పైరుకని, బయలుదేరి అలా పొలంకేసి వెళ్ళాడు.

"ఏమిటి? ఒక్కసారిగా సుశీలలో యింత మార్పు?" అన్న ప్రశ్న వేదించ సాగింది. సమస్య తెగలేదు.

రాత్రి భోజనానికి సుశీల స్వయంగా నీళ్ళు తెచ్చి యిచ్చి, కాళ్ళు కడుక్కోమంది. చలాకీగా వడ్డించింది. సుశీల కళ్లలోకి — అత్తగారి కనుమాటుగా, సూర్యం చూస్తూనే భోజనం చేస్తున్నాడు. చిరునవ్వు నవ్వుతూ, సిగ్గు నొలకబోస్తూ

'సూదంటురాయి' లాంటి చూపుల్తో సూర్యం వైపు సూటిగా చూసేది.

విషయాన్ని అప్పటికి అర్థం చేసుకున్నాడు. నేను చంద్రంతో సుశీల 'బైతు' అని చెప్పటం విని వుంటుంది. అంచేతనే, యింత చలాకీగా ప్రవర్తిస్తోంది. చంద్రాన్ని చూసే కాదు, నాతో కూడా వచ్చిననాటికంటె, ఎన్నో రెట్లు, చనువుగా మారింది. నేననుకొన్నది పొరబాటే; అనుకుంటూ, కమ్మని కలలు కంటూ, కన్నుమూశాడు.

## 4

అత్తగారి ముఖంచూసి సూర్యం చాలా సంతోషించాడు. 'మేనుష్టరం యిలా వుండటం, అత్తయ్యకు యిష్టమే అన్నమాట' అనుకున్నాడు. అతనికి కాస్త ధైర్యం చిక్కింది.

సుశీల కాఫీ గ్లాసు తీసుకొని, గుమ్మందాకా వెళ్ళి వెనక్కి తిరిగి, సూర్యం కళ్ళలోకి చూచింది. ఆ మిలమిల మెరిసే చూపులు అతని హృదయంలోకి దూసుకుపోయాయ్.

నవల పేజీలు తరగటం లేదు. సుశీల, ఎప్పుడు తన ముందుకు వచ్చి, తనతో మాట్లాడుతుందా అని, సూర్యం తహతహ లాడిపోయాడు. ఇంతలో "బావా స్నానానికి లే" అని తువ్వాలు యిచ్చింది.

"యిప్పుడు కాదు." అన్నాడు అదోలా, సుశీల ముఖంలోకి చూస్తూ.

"ఏం?" అంది ఆశ్చర్యంగా.

"నేను పట్టి తోముకోలేను." అన్నాడు నవ్వుతూ.

"పంగలిని పిలిపించమంటావా?"

"నువ్వు తోమరా......"

"ఏతేవాడెవ్వులే! ఎవరేనా చూస్తే..." అని, సిగ్గు పడుతూ వెళ్ళిపోయింది.

సూర్యం తెల్లముఖం వేశాడు. "యిలా పిచ్చిగామాట్లాడేనేమిటి?" అని తుండు కట్టుకొని, స్నానానికి లేచాడు.

"సబ్బు!" అని కేక వేశాడు.

సబ్బుతో నిలబడింది సుశీల.

ఆమె ముఖం మీదకి నీళ్ళు చల్లాడు. ఆమె తుర్రుమని చిలుకలా ఎగిరిపోయింది.

అంతలో రత్తమ్మ ఎదురై "ఏమే! అలా పారిపోతున్నావ్? బావ..." అని ప్రశ్న చేయకుండానే సూర్యం "కొంచం చన్నీళ్ళిమంటూంటే, పారిపోతోంది అత్తయ్యా" అని పిర్యాదు చేశాడు.

"ఇవ్వవే చన్నీళ్ళు" అన్న రత్తమ్మ మాటలు, సూర్యానికి హుషారు, సుశీలకు ఉక్రోషాన్ని కలిగించాయి. "ఊరుకో అమ్మా! నీకు తెలీదు." అని బుంగమూతి పెట్టింది.

రత్తమ్మ నీళ్లు తెచ్చింది. సూర్యం స్నానంచేసి, తన గదిలోకెళ్ళి, తల దువ్వుకుంటున్నాడు.

"ఎట్లా అయినా సుశీలతో మాట్లాడాలి. నేను యింత తెలివైందని అనుకోలేదు" అనుకుంటుండగా, ఏదో ఆలోచన తట్టి, 'గమ్మున', ఆ మౌనాన్ని ఛేధించి, "సుశీలా!" అని పిలిచాడు.

"ఏం?"

"కొబ్బరినూనె తీసుకురా!"

సుశీల సీసా అందిస్తూంటే, ఎగాదిగా చూశాడు. సీసా అందుకుంటూ "ఎప్పుడు నీళ్ళోసుకున్నావ్?" అన్నాడు.

కళ్ళెర్ర జేసింది సుశీల.

"అబ్బెబ్బే! స్నానం యింత ప్రొద్దున్నే, ఎప్పుడు చేశావూ అని".

"చాల్లే!" అని వెళ్ళిపోతుంటే, వెనక్కి పిల్చి, నూనె వాసనచూసి, "ఛా! యిదేం వాసన?" అంటూ సుశీల ముక్కుకు సీసాను తాకించాడు.

సుశీల అనుకోకుండా సూర్యం చేతిని వెనక్కి నెట్టింది; సూర్యం చిలిపిగా నవ్వుతూ, ఆమె చేయిని పట్టుకొని, 'సీసా బ్రద్దలౌతుంది. జాగ్రత్త' అంటూ ఆ తన్మయత్వంలో, తనే సీసాను వదలివేశాడు.

భళ్ళున ముక్కలైపోయింది.

* * *

తన చేతిని తాకగానే, ఏదో చెప్పలేని సుఖం అనుభవించినట్లయ్యింది. చేయి తగిలినంతమాత్రాన్నే, అంత ఆనందం

ఉన్నాంగీతే... ఒక్కొక్కరికి ...ఎక్కడ వుంటుందో! అని సూర్యం అనుకుంటూ తీయని అనుభూతులతో, కమ్మని కలలతో రాత్రింబగళ్ళు చక్రాలా, నెట్టించేశాడు.

అలా, పండుగ సెలవలు పూర్తి కావచ్చాయి. ఇక రెండే రెండు రోజులున్నాయి. సుశీలని మళ్ళా ఎప్పుడు కలుసుకోవటం? అన్న ఆలోచనలలో మునిగాడు.

సుశీలకూడా 'బావ' వెళ్ళిపోతే ఎలా? అని బాధపడసాగింది.

## 5

మరునాటి ఉదయం, చంద్రం వచ్చి "సూర్యం ఉన్నాడా ఆంటీ?" అని రత్తమ్మను అడిగాడు.

"లోపలున్నాడు నాయనా."

చంద్రం లోపలికి అడుగుపెట్టేసరికి, సూర్యం ఏదో, ఆలోచిస్తున్నాడు.

"ఏమిట్రోయ్ ప్లాన్?" అన్న చంద్రం ప్రశ్న ఆలోచనల సుడిగుండంలోంచి సూర్యాన్ని బయటపడేసింది.

"అబ్బే! ఏమీలేదు. కూర్చో!"

"ఊసిపోవటం లేదన్నావు. మా యింటికి రావటం లేదేంరా? మీ వూరు వెళ్ళిపోయావేమో అనుకున్నాను."

"మీ పాలెం వదలి వెళ్ళేబుద్ధి వేయటం లేదురా." అన్నాడు నవ్వుతూ

"అంతేలే. వాతావరణం మారినట్టుగా వుంది."

ఇద్దరూ నవ్వుకున్నారు. "అయితే మన ప్రయాణం రేపా? ఎల్లుండా?" అన్నాడు చంద్రం.

సమాధానం సూటిగా దొరకక, "నేనింటికెళ్ళి డబ్బు తెచ్చుకోవాలిగా." అన్నాడు.

"మీ అత్తవారిని యివ్వమనరా! ప్రస్తుతం వంద సరిపోతాయిగా!"

"సరిపోయింది, యిప్పటినుంచీనా? అది గాకపోయినా, అత్తవారి డబ్బుతో చదువేమిటి?"

"ఓ! ఆ ఒక్క వందతో అయిందా? మీకున్న ఆస్తికి, ఏ పాతిక వేలో ఆడక్కుండా వుంటారా?"

"అలా అనుకోకెన్నడూ! నేను కట్నానికి ఎన్నడూ ఆశించను.

"ఇక్కడ కాదు. రేపు నాన్నముందు నోరు పెగలాలి."

"అదీ నిజమేలే. కాకపోతే. నాకు కట్నం ఆశలేదు సుమా."

"నువ్వొక్కడ! ఆదర్శపురుషుడివి! ఇంతకీ ప్రయాణ మెప్పుడూ?"

"ఎల్లుండి! అక్కడినుంచే లెటర్ వ్రాస్తానులే నాన్న గారికి."

చంద్రం వెళ్ళిపోయాడు.

*　　　*　　　*

ప్రక్క గదిలోవున్న సుశీల మరీ బాధపడిపోయింది. రెండు కన్నీటిబిందువులు, 'బావ'కు వీడ్కోలుగా, తెలుపు మీద, ముత్యాలలా, రాలాయి. అయినా ఆపుకొంది. సామ్యం గదిలో కెళ్ళింది. "బావా" అని ఎంతో గద్గదస్వరంతో పిలిచింది. ఆ పిలుపు సామ్యం మనసును ఊపింది.

'ఏం?' అన్నట్టు ఆమె ముఖంలోకి చూశాడు. "ఇంక సెలవులు లేవా బావా?" అంది అమాయకంగా.

"లేవు సుశీలా" అన్నాడు భారంగా. అంతలోనే, "వేసంగి సెలవలకు వస్తాగా! అయినా ఎల్లుండిగదా ప్రయాణం. యిప్పుడే ఎందుకు విచారం?" అన్నాడు.

సుశీల అలాగే నిల్చుండిపోయింది.

"నాదే పొరబాటు. నేనీమధ్య, రెండేళ్ళబట్టి రాలేకపోవటం. అమ్మ పోయాక మీకు, మాకు, రాకపోకలు తగ్గిపోయాయి. కాని ఇకనుంచి..." అని, వెంటనే "నేనలా బయటకెళ్ళివస్తా." అని వెళ్ళిపోయాడు.

సుశీల చాలాసేపు ఏదో చెప్పలేనంత అసంతృప్తితో అల్లలాడించిపోయింది. కాని తను ఏమిచేయగలదు? అమ్మతో చెపితేమాత్రం, ఏమిటి లాభం? అవతల పెద్దచదువు! బి.ఏ. మాటలా? చీటికిమాటికీ, మానటానికి వల్లా? పోనీ బావను మరో రోజు ఆపమని నాన్నతో చెపితే? కోప్పడతాడు. అది కాకపోయినా, నేనెలా చెప్పగలను? అనుకుంటూ మంచం మీద వాలిపోయింది.

రత్తమ్మ వచ్చి, "అమ్మాయ్! నేను సుబ్బమ్మత్త యింటికి పేరంటానికి వెడుతున్నా. నువ్వు యింట్లో వుంటావా? వస్తావా?" అంది. "నేను రానే. నువ్వు వెళ్ళు." అంది సుశీల ఆ నిద్రమత్తులో.

* * *

చీకటి ముసకముసకగా అలుముకుంది. కీచురాళ్ళు ఎందుకో ధ్వని చేస్తున్నాయ్. మిణుగురు పురుగులు మెరుస్తున్నాయ్.

సూర్యం మామిడి తోపులోంచి వస్తున్నాడు. ఒక కొమ్మ అతని దవడను చీల్చింది. చివచివలాడింది. చేత్తో తుడుచుకుంటూ, యిల్లు చేరాడు.

మెట్లెక్కి, లోపలికి ప్రవేశించాడు. సుశీల దీపం వెలిగిస్తోంది. ఆ వెలుగులో ఆమె ముఖం మరీ అందంగా వుంది. కాలి వేళ్ళపై నిలబడి, గోడకు తగిలించి వున్న దీపాన్ని వెలిగిస్తూ అజంతా రేఖాచిత్రంలా ఉన్న ఆమె అంగ సౌష్ఠవ సౌందర్యం సూర్యం మనసును చలింపజేసింది. "అబ్బ! ఎంత అందంగా వుంది?" అనుకున్నాడు.

'సుశీలా! అమ్మేది?' అన్నాడు.

'పేరంటానికి వెళ్ళింది' అంటూ సూర్యం వైపు చూసి, 'అయ్యో! ఆ దెబ్బేమిటి? రక్తంకూడా వస్తోందే!' అని తడబడుతూ సూర్యం దవడమీద చేయివేసి చూసింది. ఆ

అనుకొని స్థైర్యంగా సిగరెట్టు ముట్టించి, దీపం కేసి చూస్తూ, కుర్చీలో కూలబడ్డాడు.

# 6

రాత్రి భోజనం చేశాడు. కాని సుశీల వడ్డించలేదు. సూర్యం తినలేకపోయాడు. రత్తమ్మ "ఏం నాయనా? అలా వున్నావు. వంట్లో బాగోలేదా?" అన్న ప్రశ్నకు పోనన్నట్టు తల వూపి, చేయికడుక్కుని లేచాడు. రోజూ సుశీల తువ్వాలిచ్చేది. కాని యిప్పుడు లేదు. ఎంత మార్పు!

రాత్రి గడవటంలేదు. ఏదో భయం. ఆందోళన. సుశీల ఏడుస్తూ బయటకు వెళ్ళింది. వాళ్ళమ్మతో చెబుతుందేమో? చెపితే, నేనేంకావాలి? యీ ఆలోచనలతో చాలా రాత్రి గడిచింది. నిద్రపట్టటంలేదు. తనకు దెబ్బ తగలటం, సుశీలను కౌగలించుకోవటం, నలిగిన దుస్తులతో, రేగిన జుట్టుతో, ముచ్చెమటలు పోసిన ముఖంతో, సుశీల కన్నీరు కారుస్తూ, దీనంగా తనవైపు చూడ్డం, ప్రతిదీ కళ్ళ ముందు కనిపించాయి. రాత్రంతా యిలా సంఘర్షణలతో, సతమత మయ్యాడు.

తెల్లవారింది. చంద్రం యింటికి వెళ్ళి, "మధ్యాహ్నమే ప్రయాణం" అన్నాడు.

'కంగాముంగా' భోంచేస్తూ "అత్తయ్యా! నే నీవేళే వెళ్ళాలి. రేపు కాలేజీ వుంది" అన్నాడు.

"అయ్యో! అదేమిటి? నిన్నేకదా, ఎల్లుండి ప్రయాణ మన్నావు?"

"ఊహు! ఈ వేళే వెళ్ళాలి."

చంద్రంకూడా వచ్చేశాడు. కంగారుగా అన్నీ సర్దుకొని, సూర్యం తయారయేసరికి, సుబ్బన్న వచ్చి, "ఒరే సూర్యం! శెలవలలో మళ్ళీ రారా! యీ వందా పట్టుకెళ్ళు" అని యిచ్చాడు నోట్లు.

"నాకెందుకు మామయ్యా?" అన్నాడు ముఖమదోలా పెట్టి.

"ఫర్వాలేదురా" అని బలవంతాన, సూర్యం జేబులో పెట్టాడు.

బండివాడు బెడ్డింగు బండిలో పెట్టాడు. సూర్యం సుశీల గదిలోకెళ్ళాడు. యిప్పటివరకు యిటు చూస్తున్న ముఖాన్ని, చటుక్కున అటు తిప్పేసుకుంది.

ముఖాన్ని రుమాలుతో కప్పుకొని "ఉత్తరాలు రాస్తూవుండు సుశీలా" అని చరచరా బయటకు వచ్చేశాడు.

బండి కదిలింది. పాలెం పొలిమేర దాటి, పెద్దరోడ్డు పట్టింది. అక్కడే యిద్దరూ కాకినాడ బస్సు ఎక్కారు. గాలిని చీల్చుకుంటూ బస్సు వేగంగా దూసుకుపోతోంది. సూర్యంలో ఆలోచనలు కారు చక్రాల్లా తిరిగి పోతున్నాయి. మనసు మాత్రం నలిగిపోతోంది. చంద్రం యిదివరలో అన్న మాటలు నిజమే. స్త్రీ దూరంగా వుంటేనే" అందం, ప్రేమ.

కాని, యీ పదిరోజులలోనూ, పూచనువు మన్మల్ని మ...
దగ్గరకు చేర్చింది. మొదట సుశీల దూర ...గానే
వుండేది. కాని నేనే........దేవుని దయవల్ల సుశీలకు
అన్యాయం జరగకుండా వుండాలి అనుకున్నాడు.

చంద్రం యీ ఆలోచనలకు ఆటంకం కలిగించి "పెళ్ళి
ప్పుడురా ?" అన్నాడు. ఆ మాట సూర్యం హృదయంలో
ప్రళయాన్ని రేపింది.

ఎప్పుడూ అడగంది యీ వేళే, వీడిలా ఆడగటానికి
కారణమేమిటి ? నిన్నటిసంగతేమన్నా వీడికి తెలిసిందా ?
అబ్బే! ఎలా తెలుస్తుంది ? అని సరిపెట్టుకొని "ఇప్పుడెందు
కురా !" అని తప్పించుకున్నాడు.

ఇద్దరూ రూముకి చేరుకున్నారు. సూర్యానికి అంతా
కొత్తగా వుంది. జరిగిందంతా కలలా వుంది.

కాని బస్తీ వాతావరణం బెంగను, బాధను చల్లా
ర్చింది. చంద్రం పుస్తకాలలో మునిగిపోయాడు.

# 7

సూర్యం మనసులో తుఫాను రేగింది. తనతండ్రి విచి
త్రమైన మనిషి. జమీందారీ ఫాయిలో వుంటాడు. మేనరిక
మైనంత మాత్రాన, సుశీలవంటి పిల్లతో పెళ్ళిచేయటం ఒప్పు
కుంటాడా ? అంగీకరించకపోతే, తనేమి చేయగలడు ? ఆయన

ముందు పూర్తిస్తోమే భయం. కాని ఎలా? యిలా ఒక నెల గడిచిపోయింది.

ఒకనాడు, అర్జంటుగా బయలుదేరి రమ్మని తండ్రి వ్రాసిన ఉత్తరం అందింది. "ఎందుకో!" అనుకుంటూ 'పగల పూజి' చేసుకున్నాడు.

సోఫాలో సాక్షిగా కూర్చుని "చదువు బాగా సాగుతోందిరా?" అన్నాడు రంగనాథం.

"బాగానే సాగుతోంది." నములుతూ వచ్చింది సమాధానం.

"ఈ సంవత్సరం నీకు పెళ్ళి చేసేద్దామనుకుంటున్నా. మరి నీ ఉద్దేశ్య మేమిటి!" అన్నమాటలు సూర్యానికి గిలిగింతలు పెట్టాయి. సుశీలకు అన్యాయం జరుగదు. సుశీల తనకు... అని తియ్యని తలపులలో తేలుతూ "మామయ్య ఉత్తరం వ్రాశాడా" అన్నాడు.

రంగనాథం ముఖం ఎర్రబడింది. "మామయ్యెవడ్రా? అదంతా మీ అమ్మతోటే ఆఖరయ్యింది. అదికాకపోయినా వాళ్ళకేముందిరా నీముఖం? ఆ పెంకుటిల్లు, రెండెకరాల మాగాణేగా? వియ్యానికైనా, కయ్యానికైనా సమానమైన చేతులుండాలి, పెద్ద సంబంధం చెయ్యాలని వుండేది. నాకోరిక ఇప్పుడు నెరవేరింది, జడ్జీయే కబురు పంపాడు. అమ్మాయి కాకినాడలోనే వుంది." అన్న మాటలు సూర్యంమీద పిడుగుల్లా పడ్డాయి.

'నా కిష్టంలేదు.' అందామనుకొన్నాడు. అనలేకపో యాడు.

"ఏమిట్రా నీ ఉద్దేశ్యం? ఆ పల్లెమామయ్య కూతు రునే, పెండ్లాడాలని వుందా? మొన్న శెలవలలో నిన్నక్క డికి వెళ్ళనియ్యడమే పొరబాటన్నమాట. ఈ జడ్జి పాతిక వేలు యిస్తానంటున్నాడు. ఎదురొచ్చిన అదృష్టాన్ని కాలితో తన్ను కోకు. ఇదంతా ఎవరికోసంరా?"

సూర్యం తల తిరిగిపోయింది. తండ్రి నిప్పులు కురిపిస్తు న్నాడు. "ఏమిటి చెప్పటం?" అని సూర్యం నలిగిపోతున్నాడు.

"ఏం? చెప్పు. యిష్టంలేదా? అయితే నా యింటికి రానటానికి వీల్లేదు. నేను కావాలంటే యీ పిల్లని పెళ్ళి చేసుకో."

ఆ సింహగర్జనలకు లొంగిపోయి "సరే మీ యిష్టం." అని భారంగా ఆ ఒక్క ముక్కా నోటంట జారవిడిచాడు.

గొంతుక మార్చి, "నాకు ఎవరున్నార్రా? నే నేం చేసినా, నీకోసమేగా" అన్న ఓదార్పు మాటలుతోబాటు "కాకినాడ రేపే వెడదాం. రేపు పంచమి, అనూరాధా నక్షత్రం. మంచిది." అని రంగనాథం బయటికి వెళ్ళిపోయాడు.

సూర్యానికి మనస్థిమితం మాయమయింది. ఓప్రక్క జడ్జికూతురు, పెద్దకట్నం, హోదా; మరోప్రక్క ఆఘ్రాణిత పుష్పం ... సుశీల. ఏమిటి చేయటం? అన్న సమస్యలు సూర్యాన్ని పీడించసాగాయి.

*   *   *

జీవితంలో వివాహ సమస్య విలుస్తుంది. కొందరిని ఆకాశంలో ఆనందంగా విహరించేటట్లు చేస్తుంది. కొందరిని కణకణలాడే కుంపట్లో కాలుస్తుంది. ఈ రకంవాడిని నేను. నే ప్రేమించిన పిల్లను పెండ్లాడ్డానికికూడా అధికారం లేకుండా పోయింది. నాకు పడి, సుశీల యావజ్జీవితం విలపిస్తుంది. ఇంత చదువు చదివి, నే చేసిన ఘనకార్యం ఏమిటి? అని సూర్యం మనస్సు కుతకుతలాడిపోయింది.

మరునాడు, రహస్యంగా తండ్రితో కలసి, కాకినాడ బయలుదేరాడు. కారు వేగంగా పరుగెడుతోంది. సూర్యం హృదయం దడదడమని కొట్టుకుంటోంది. కారు ఆగింది. జడ్జి నవ్వుతూ ఆహ్వానించాడు.

ఫలహారాల అనంతరం, కమలను తీసుకొచ్చి కుర్చీలో కూర్చోబెట్టారు. సూర్యం చూశాడు. అతనిలో ఏదో చెప్ప రాని మార్పు వచ్చింది. ఎంత అందకత్తె! దానికితోడు పాడుతూ, ఫిడేలు ఎంత బాగావాయిస్తోందో! అని మురిసి పోయాడు. ఆ మురుపులో సుశీల మాటే మరచిపోయాడు.

రంగనాథం యింటికెళ్ళి వుత్తరం వ్రాస్తానని లేచాడు. సూర్యంతో కలసి లాడ్జికి వచ్చాడు.

# 8

సూర్యం చాలా సంతోషంగా వున్నాడు.

"ఏరా! హుషారుగా వున్నావు? ఏమిటి సంగతి?" అన్నాడు చంద్రం.

"అందంగా, సన్నగా వున్న మెరుపుతీగలాంటి అమ్మాయితో మన పెళ్ళి." అన్నాడు గర్వంగా.

"ఓ! మరి సుశీల సంగతో ?"

సూర్యం నెత్తిమీద గొడ్డలిపెట్టులా తగిలిందామాట. అతని ముందు మళ్ళీ పెద్దసమస్య బ్రహ్మరాక్షసిలా, ప్రత్యక్షమయ్యింది. అటు అందాలరాశి కమల. ఇటు అమాయకజీవి సుశీల. ఎవరిని ? ఎలా ? అని ఆలోచిస్తూ "నేను ఓడిపోయేనురా చంద్రం." అన్నాడు దిగులుగా.

ఇంతలో పోష్టు వచ్చింది. సూర్యం హృదయం తహతహ లాడింది. కవరు చించాడు. మొదటిమాట 'బావా' అని చదివాడు. గుండె గుభేలుమంది. "చంద్రం! యిప్పుడే వస్తావుండని" చెప్పి, బయటపడ్డాడు. నడవడానికి కాళ్ళాడ్డంలేదు. రిక్షా ఎక్కాడు. ఉత్తరం విప్పాడు.

"బావా!

నువ్వు వెళ్ళి అప్పుడే రెండు నెలలయింది. నన్ను మరచిపోయావా ? సముద్రంలో మునగటానికి సిద్ధంగా వున్నాను. తప్పక మునిగిపోతాను. యిన్నాళ్ళు నటించాను. బావా ! ఇక దాచలేను. నేనే దాగిపోవాలి. మరోదారిలేదు బావా ! ఉంటే నువ్వే చూపించాలి. ఇంక నేనేమీ చెప్పలేను. ఈలోపున నిన్ను ఒక్కసారైనా చూడాలని వుంది బావా. రావూ ? ఇదంతా ఏడుస్తూ వ్రాస్తున్నాను.

ఇట్లు

నీ, సుశీల.

సూర్యం గజగజ వణికిపోయాడు. రిక్షా 'వాటర్ వర్క్స్' దగ్గర ఆగింది. ఆ 'యింజను'లా అతని హృదయం కొట్టుకుంటూంది, ఆ ఎత్తైన పచ్చని దిబ్బమీద కూర్చు న్నాడు. 'సుశీల' పేరు ఎత్తితే ఉబికివచ్చే దుఃఖం, ఆపలేని ఆవేదనలలో సూర్యం మునిగిపోతున్నాడు. ఆ సుడిగుండంలో గిర్రున త్రిప్పేస్తున్నాయి. తనెక్కడికి పోతాడో, ఏమైపో తాడో తనకే తెలియటంలేదు. 'నన్నెదిరిస్తే నీకు దారిలేదు' అని, ఓప్రక్క సింహంలా హడలెత్తిస్తున్న తండ్రి; 'నన్ను కాదనలేవు.' అని కమల ఓప్రక్క, 'నా గతి యింతేనా ?'అని సుశీల ఒకప్రక్క, అతని శరీరంలోని ప్రతి అణువునూ నలి పేస్తున్నారు. భారంగా రూముకు తిరిగి చేరుకున్నాడు. స్నానం పూర్తిచేసి బట్టలు మార్చుకుంటున్న రంగనాథం "ఏరా! పిల్ల ఎలావుందీ ?" అన్నాడు.

బాగా లేదంటే యిదో పాపం అనుకొని, బాగానే వుందన్నాడు సూర్యం.

"అయితే నేవస్తా !" అని సంతోషంగా, రంగనాథం వెళ్ళిపోయాడు. అతను వెళ్ళినవైపు కళ్ళప్పగించి చూస్తూ, సూర్యం నిలబడిపోయాడు. ఎంతసేపటినుంచో గట్టిగా ఏడ్చే ద్దామనుకుంటున్నది యిప్పటికి సాధ్యమైందని, మంచమెక్కి ఉబికే దుఃఖాన్ని వరదలా ప్రవహింపజేశాడు. దాంతో కాస్త మనశ్శాంతి దొరికింది.

కాలేజీ నుంచి చంద్రం వచ్చి, "మీ నాన్న వెళ్ళిపోలే దేమిట్రా ?" అన్నాడు.

"ఆ"

"ఇప్పుడు నేను వాలెం వెళుతున్నానురా. వస్తావా?"

"నేను రానుగాని, ఒక పని చెయ్యాలిరా."

"ఏమిటది ?"

"సుశీల ఎలావుందో చూసి, ఏమన్నా చెపితే కనుక్కురా."

"సందేశాని, శుభమూ అంటూ వెళ్ళేటుంటే, అలా నీరసంగా వుంటావేరా ?"

"ఆ! అన్నట్టు మరిచాను. నా పెళ్ళి సంగతి చెప్పకురోయి. బాధపడుతుంది."

"ఏం ? పెళ్ళి చేసుకుంటాననని వాగ్దానం చేశావా ?" అన్న ప్రశ్న సూర్యం హృదయాన్ని గాయపరిచింది.

"లేదుగాని పెళ్ళిరా" అన్నాడు సూర్యం.

చంద్రం వెళ్ళిపోయాడు. ఎంతపని చేశాను ? పాపం! సుశీల యిప్పుడు గర్భిణీ. ఎల్లా వుందో ? ఆముక్క ఉత్తరంలో వ్రాయలేకపోయింది. ఎంతద్రోహం చేసినా, నన్నింకా 'బావా !'అని ఎంత తియ్యగా అంటోంది? అని విలపించాడు.

రోజులు యుగాలుగా గడుస్తున్నాయి. పరీక్షలు సమీపించాయి. చదవలేకపోతున్నాడు. గదిలోమాత్రం బండరాయిలా పడివుంటాడు.

## 9

సుశీల చలాకీ అంతా చల్లారిపోయింది. కాని ఎప్పుడూ ఏదో ఆశతో ఎదురు చూస్తూంటుంది. తిండి తినదు. కళ్ళు లోతుకుపోయాయి. చెక్కిళ్ళు గుంటలు పడ్డాయి. ఒక్క మాటులో — సుశీల ప్రాణాలు కళ్ళల్లో కనిపిస్తున్నాయి.

రత్తమ్మకు ఇదేమీ అర్థం కావటంలేదు. ఇదేదో జబ్బు అని తల్లిదండ్రులు తల్లడిల్లిపోతున్నారు. మందులిప్పిస్తున్నారు.

సుశీలకు రోజు ఒక యుగంలా గడుస్తోంది. గదిలో ఆ మంచాన్ని, బల్లిలా అంటిపెట్టుకొని వుంటుంది. ఒక్కొక్కసారి ఎవ్వరూ చూడకుండా 'బావా! బావా!' అని వెక్కి వెక్కి ఏడుస్తుంది. "నన్ను మర్చిపోయావా బావా!" అని బాధపడిపోతుంటుంది. ఎవ్వరికీ ఏమీ చెప్పదు. ఆ కళ్ళలో కాంతి లేదు. "నన్ను విడిచి ఎలా వుంటున్నావ్ బావా?" అని ఆలోచన.

ఏదో బాధ, ఆమె హృదయంలో "అగ్నిపర్వతం"లా రగులుకొని, ఆమె రక్తాన్ని హరిస్తోంది. ఆ బెంగ అస్థిపంజరంలా చేసింది. సుశీల నేడొక చలనంలేని బొమ్మ! జీవంగల శల్యాగృహం. ఆశ లేని అర్ధజీవి. ఆ 'అర్థా' తన బావకోసం.

చంద్రం వచ్చాడు. "సూర్యానికేమైనా చెప్పమంటారా?" అన్నాడు రత్తమ్మతో.

"పిల్లకి జబ్బుగా వుంది నాయనా! సూర్యాన్ని ఒకసారి రమ్మనను. బావను చూడాలంటోందని చెప్పు." అంది పైటి చెంగుతో కళ్ళు నద్దుకుంటూ.

"సరేనండి" అంటూ చంద్రం వెళ్ళిపోయాడు.

*　　　*　　　*

రూముకు చేరుకోనేసరికి సూర్యం కనిపించాడు. రెండు రోజులలో ఎంత మార్పు! ఆ హుషారంతా ఏమయింది? దించుకుపోయిన బుగ్గలు, నీరసించిన చూపులు, కంటినిండా కన్నీరు చూసేసరికి చంద్రం మనస్సు చివుక్కుమంది. కాస్త చలాకీగా వుంటాడేమోనని, "సుశీలను చూశానురా!" అన్నాడు.

సూర్యం ఉలిక్కిపడి "ఎలావుంది?" అన్నాడు.

"ఎలా వుండడమేం? నేను వెళ్ళగానే కాఫీ యిచ్చింది. చేత్తో పుచ్చుకోనేదాకా, వదలందే! స్వయంగా తనచేత్తో యిచ్చింది. నీసంగతి......"

"చాల్లే! ఆపు!" అన్న సూర్యం గర్జనతో గది మారుమ్రోగింది.

చంద్రం హడలిపోయాడు. సూర్యం కళ్ళు ఎర్రబడ్డాయి. ముఖం కందగడ్డలా అయింది. "మోసం! శుష్కించిపోయానని, గర్భిణీనని వెధవ వ్రాతలు వ్రాయటం దేనికి?" పెను తుఫాను రేగింది.

'సుశీల బుద్ధి చంచలం. నాతోలాగే, వీడితోకూడా సరసాలాడి, కాఫీ చేతికందించిందట. వేళ్ళు గిల్లించుకొని వుంటుంది. వెధవ బుద్ధి.' అనుకొని చంద్రంవైపు కోపంగ చూశాడు. చంద్రం ఏదో చెప్పబోయాడు. కాని చెప్పనివ్వ లేదు. "నే వెడుతున్నా! నీలాంటి నీచుడితో స్నేహం చేయటం పొరపాటు." అని చంద్రంమీద ఉరిమి, అతను చెప్పేది వినకుండా, అప్పటికప్పుడు హోటల్లోకి తన లాడ్జింగును మార్చేశాడు.

* * *

సూర్యం తన మంచంమీద పడుకున్నాడు. సిగరెట్టు కాలుస్తూ "సుశీలకు ద్రోహం చేయటం తప్పుగాదు. పరాయి మగవాడికి కాఫీ అందించి, పుచ్చుకొనేవరకు బలవంతం పెట్టటమా? చేతికందివ్వటమా? వీడు వేళ్ళతో నాలాగే నొక్కకుండా వున్నాడని నమ్మకమేమిటి? వీడు కాకపోతే అది చేయలేదని నమ్మకమేమిటి? ఆనాడంత సిగ్గు అభినయించడం దేనికి? యిప్పుడీ విచ్చలవిడి విన్యాసం ఎక్కడి నుంచి ఉట్టిపడింది? నేను ద్రోహం చేయలేను. తనే గిలిగింతలు పెట్టి, నన్ను రాసుకు తిరిగి వశపరచుకొని, సుఖాన్ని అనుభవించింది. నన్నే ఆ వేదనలో ముంచి యిన్నాళ్ళు చంపింది. శ్రీరాముడు తండ్రిమాట విన్నాడు. నేనూ అంతే. నాతండ్రి కంటె ఆ నీచురాలు ఎక్కువా?". దాంతో సుడిగుండం తగ్గింది. హృదయం నిర్మలమయింది,

సూర్యంలో "పెళ్ళికళలు" మిలమిలమెరసేయ్. కాలే జీకి వెడుతున్నాడు. చంద్రం ఏదో చెబుదామని మరునాడు దగ్గరకు వస్తూంటే, సూర్యం ఉమ్మివేసి అక్కడినుంచి వెళ్ళి పోయాడు.

పరీక్షలు బాగా వ్రాస్తున్నానని, కొద్దిరోజులలో వస్తా నని, యీలోగా 'సూట్సు'కి డబ్బు పంపవలసిందని సూర్యం వ్రాసిన ఉత్తరం రంగనాథాన్ని సంతోషంలో తేల్చింది. వెంటనే 300 మనియార్డరు చేశాడు.

ముహూర్తం సమీపిస్తోంది. మరో ఐదిరోజులు వుంది. అంతా పెళ్ళి హడావిడిలో వున్నారు.

కాలేజీ మూసేశారు. అందరూ యిళ్ళకి వెళ్ళిపో తున్నారు. చంద్రంకూడా వెళ్ళిపోయాడు.

తెల్లవారితే పెళ్ళి. చుట్టాలు, స్నేహితులు చాలా మంది వచ్చాశారు. రంగనాథంగారి రైతులు రెండెడ్ల బళ్ళు కట్టారు. కొందరు కంట్రాక్టు బస్సు లెక్కారు.

జడ్జీగారి భవనం కిటకిటలాడుతోంది.

మగపెళ్ళివారికి మర్యాదలన్నీ సవ్యంగా, జరుగు తున్నాయి. పేరంటాళ్ళు వచ్చి, చాటుమాటుగా, సూర్యాన్ని చూసి పోతున్నారు. సూర్యం చాలా నిర్మలంగా వున్నాడు. సుశీల మాటే మరచిపోయాడు. చంద్రాన్ని పెళ్ళికి పిలవలేదు.

శుభముహూర్తం సమీపించింది. మంగళ వాయి ద్యాలు మిన్నుముట్టాయి. మూడుముళ్ళు పడిపోయాయి.

# 10

ఆ రాత్రి శోభనం! సూర్యం హుషారుగా, విలాసంగా మంచంమీద పడుకున్నాడు. ద్రాక్షపళ్లు నవ్వుతున్నాయి. అగరువత్తుల పొగలు, మల్లె ఘుమఘుమలు గిలిగింతలు పెడుతున్నాయి. కమల సిగ్గుతో తలుపుదగ్గర నిలబడింది. సూర్యంలేచి నెమ్మదిగా ఆమె దగ్గరకుచేరి, భుజం మీద చేయివేశాడు. ఆమె ముడుచుకుపోయింది. యింకా దగ్గరకు తీసుకొని ఆమె చిరుగడ్డాన్ని పట్టుకొని, ఆ కళ్ళలోకి అదోలా, చూశాడు. ఆ చూపుకి సమాధానంగా కమల ముఖాన్ని దాచుకుంది.

ఆమె నడుముకు చేతులు చుట్టి. యింకా దగ్గరకు తీసుకున్నాడు. కమల నడిచిందో లేదో ఆమెకు తెలీదు. ఇద్దరూ పెనవేసుకుపోయారు. తీయటి తన్మయత్వంలో మునిగిపోయారు. అర్థంకాని ఆనందాన్ని ఆస్వాదించారు. రాత్రంతా హాయిగా గడచిపోయింది.

*  *  *

ఇక్కడ —

సుశీల 'బావ పెళ్ళి' అని రత్తమ్మ చెప్పటం విన్నాక మరీ మారిపోయింది. రంగనాథం నలుగురితో బాటు నాశాయణా అన్నట్టు, సుబ్బన్న పేరున, శుభలేఖ వ్రాయకపోయినా బాగుండేది. ఆ శుభవార్త సుశీలను వేదించడం ప్రారంభించింది. 'బావా!' అని మూల్గింది. ఆమెలో యిదివరకటి

ప్రాణంకూడా సన్నగిలింది. నట్టి ఎముకలగూడు. అగుపించే ఆశాకిరణాలుగూడా మాయమయ్యాయి. బావచేసిన దగాకి బావంటే అసహ్యం, కోపం, ఉక్రోషం ఆమెలో రగులుతున్నాయి. మనశ్శాంతి లేదు. దుఃఖం పొంగుకొస్తోంది. ఆపుకో లేదు. కాని కళ్ళమ్మట నీళ్ళు రావు. ఆ కళ్ళు ఏనాడో ఎండిపోయాయి. సుశీల ఆనాటితో నిద్రపోయింది. రగుల్తున్ననే అగ్నిపర్వతం చప్పగా చల్లారిపోయింది.

ఉదయమే, రత్తమ్మ లేపింది. ఇంకెక్కడి సుశీల? 'నాపురు'మని శవంమీద వాలిపోయింది.

సుబ్బన్న పాలచెంబు తెస్తూ ఆ దృశ్యం చూసి ఒక్కసారిగా స్థంబించిపోయాడు.

రత్తమ్మ "నాకూతురా! నా కూతురోయి." అంటూ సుశీల శరీరాన్నంతటిని తనిమితనిమి ఏడుస్తోంది. కడుపుమీద చేయి వేసింది. ఒక్కసారిగా, ఏడుపు ఆగిపోయింది. కొయ్యబారిపోయింది. కాని అంతలోనే ఏదో "అగ్నిపర్వతాన్ని" ఆ తల్లి తనలోనే దాచేసుకొంది.

చంద్రం వచ్చాడు. చూశాడు. ఆమె మనశ్శాంతికి రెండు కన్నీటిబొట్లు రాల్చాడు. సూర్యాన్ని తిట్టటానికి మాటలు చాలలేదు. కాని హృదయం ఏదో భాషలో, ఘోషలో మనసారా తిట్టింది.

* *

అక్కడ —

మరునాడు — కమల కాఫీ తీసుకొచ్చింది. చిలిపిగా నవ్వి కప్పు సందుకున్నాడు. ఆమె అతని ముఖంలోకి తృప్తిగా చూస్తూ "ఆ దెబ్బ ఏమిటండీ ?" అంది మృదువుగా.

ఆ మాటతో సూర్యం హృదయంలో "అగ్నిపర్వతం" పేలినట్టయ్యింది. ఆ తొత్తరపాటులో చేతిలోని కప్పు క్రింద పడి ముక్కలయ్యింది.

ఇంతలో ప్యూన్ టెలిగ్రాం యిచ్చి వెళ్ళిపోయాడు.

సూర్యం టెలిగ్రాం విప్పాడు. కళ్ళు పెద్దవయ్యాయ్. ఏమిటి ?

"సుశీల పాస్డ్ ఎవే – స్టార్ట్ – చంద్రం." వళ్ళంతా వణికిపోయింది.

"ఏమిటండీ ?" అని ఆత్రుతతో అడిగింది కమల.

సమాధానంగా రెండు కన్నీటి బొట్లు "శాంతి" "శాంతి" అన్నట్టు ఆ కాగితాన్ని తడిపాయ్.

*                *                *

సూర్యం హృదయంలోని సుడిగుండం నేటికీ ఆగనూ లేదు. ఆ తల్లి కడుపులోని "అగ్నిపర్వతం" నేటికీ పగలనూ లేదు.

ఎవరెస్టు ప్రచురణ (1) చదవండి !

# "మచ్చు తునకలు" (12 కథలు)

"తేలికైన భాష, తీవ్రమైన భావాలు గల 'మచ్చుతునకలు' ను, రత్నం ప్రతిభావంతంగా చిత్రించారు. ప్రతి భావం, పేదల బాధల యదార్థ దృశ్యాల్ని ప్రతిబింబిస్తోంది."

— పంతుల సావిత్రి.

"మల్లెపూలు మత్తెక్కిస్తాయి. "మచ్చుతునకలు" ఆలోచనలు రేకెత్తిస్తాయి"

— సిహెచ్. సూర్యముని.

"రత్నం కథల్లో వైవిధ్యం చాలా వుంది. ఏదో ఒక నిర్దిష్టమైన ఉద్దేశ్యాల్ని వ్యక్తం చేసేందుకే ప్రతి కథా వ్రాయబడింది."

— ఆలిండియా రేడియో, విజయవాడ.

"గ్రామాలలో తగాదాలు, పేదల ఇబ్బందులు, ధనికుల దౌష్ట్యం, మధ్యతరగతివారి మనస్తత్వం, అన్నింటి "మచ్చు" ఈ "మచ్చుతునకల" లో మనకు లభిస్తుంది. రత్నం రచన సాఫీగా వుంది."

— ఆంధ్రప్రభ.

"ఈ కథలు రత్నం రచనా శక్తికి నిస్సందేహంగా మచ్చుతునకలు."

— తెలుగు స్వతంత్ర.

"కథావస్తువు ఎన్నుకోవడంలో నేర్పు రచయితలో పుష్కలంగావుంది. విశేషించి గ్రామీణ వాతావరణ చిత్రణంలో రత్నం కృషి ప్రశంసాపాత్రం."

— తెలుగు విద్యార్థి.

"రత్నం సాధ్యమైనంతవరకు వాస్తవిక విషయాలను వస్తురూపంగా తీసుకొన్నందువల్లనే, కథలన్నీ చక్కగా వున్నాయి,"

— ప్రజాపత్రిక.

రత్నం "మచ్చుతునకల" నుంచి తెలుసుకోవలసింది ఎంతైనావుంది."

— ఆర్థిక సమత.

ప్రతులకు :

దేశి కవితా మండలి
విజయవాడ — 2



జననం 1935. స్వగ్రామం తూర్పుగోదావరి జిల్లా, మాధవరాయుడుపాలెం. కాకినాడ, రాజమండ్రి కాలేజీలలో విద్యాభ్యాసం.

సాహిత్యం — పదాల గారడీలో మరుగు పడకుండా, అందరికీ అర్థమయ్యేలా, అందుబాటులో వుండాలని శ్రీ సత్యనారాయణరావు అభిమతం.

విశాల దృక్పథం, స్వతంత్ర భావాలు, నిర్మాణాత్మకమైన వాదన, నిశితమైన భావనాశక్తి, శ్రీ సత్యనారాయణరావు సొమ్ము.

— సంపాదకవర్గం.

---

"AGNIPARVATAM"
CH. SATYNARAYANA RAO

EVEREST PUBLICATIONS
Price As. 8/-